

ఆంధ్ర ప్రకృతి ధర్మ పరిషత్ ప్రచురము



# మసూచికము



గ్రంథకర్త:
పుచ్చా వెంకటామయ్య

వెల రు. 0=8=0



పబ్లిషర్సు:
ప్రకృతి కార్యాలయ ట్రస్టు
బెజవాడ

మొదటి కూర్పు
500 ప్రతులు
1944

# మసూచికము



ఇది ముక్కలి బాధకలిగించే వ్యాధి. దీనిని అంటువ్యాధి అని పిలుతురు. అయితే కలరా వలె ప్రాణాపాయకరమైన వ్యాధి మాత్రము కాదు. ఎందువలననగా కలరా వచ్చిన రోగి సాధారణముగా ఒకటి రెండు రోజులలోనే మరణించుటకలదు. కలరాకూడ సక్రమముగా చికిత్స చేస్తే నూటికి చనిపోవువారి సంఖ్యను ఇప్పటి కంటె నెంతో తగ్గించవచ్చును. మసూచికమును కలరాతో పోల్చినపుడు తక్కువ ప్రాణాపాయకరమైనది. అనగా సహజముగానే కలరావల్ల కంటె మసూచికమువలన చావులు చాలా తగ్గి ఉంటాయి. కలరా వలెగాక మసూచికములో చికిత్స చేయుటకుకూడా చాలా వ్యవధి ఉంటుంది. మసూచికములో చనిపోవువారుకూడా మసూచికము ఆరంభించిన తరువాత మూడు పదిరోజులు జీవించుచున్నారు. అంతేకాకుండా జీవించువారు కూడ రోగముతో సుమారు పదిహేను రోజుల వరకు బాధపడుచున్నారు. అందువలన చికిత్స

చేయుటకు నెంతో వ్యవధిచిక్కును. అందు-
వలన కలరావలె మసూచికము భయంకర-
మైన వ్యాధికాదు.

అయినప్పటికి రోగకాలమున మిక్కిలి బాధ
ఉండును కనుకను, చాలా మందికి అక్రమ-
చికిత్సవలన మచ్చలు, గుంటలు, మొదలగు
వికారరూపములు ఏర్పడుటవలనను, మసూ-
చికమునకుకూడా కలరాకు వలెనే భయపడు-
చున్నారు. అయినప్పటికి సీప్రకృతి వైద్య
విధానముగా చికిత్స చేసిన యెడల ప్రాణా-
పాయమును నిప్పటికంటె ఎన్నోరెట్లు తగ్గించ
వచ్చును. మచ్చలు కూడా లోతుగాను,
వెడల్పుగాను, పడకుండా తగ్గించుటకు వీలు
న్నది. రోగము నయమైన తరువాత ఆహార
విహారములలో కొంచెము శ్రద్ధ తీసుకొనే
యెడల చాలా కేసులలో మచ్చలు శాశ్వత
ముగా లేకుండా చేయవచ్చును.

## పేరు

సంస్కృతములో మసూర, మసుర, అవగా
చిఱుసెనగలని అర్థము. చిఱుసెనగలంత పరి
మాణముగల పొక్కులు పుట్టే వ్యాధి గనుక

ఆయుర్వేదములో దీనిని మసూచిక అని అన్నారు. చర్మమును బొబ్బలు చేసుకొని వచ్చేవ్యాధి కనుక స్ఫోటకము అనికూడా పిలుతురు. సూచి అనగా సూది, సూదితో పొడిచినట్లుండు బాధతోను, సూదితో పొడిచి నట్లుండు రంగుతోను, ఆకారముతోను, ఆరంభించునుగాన నీ రోగమును మసూచి అని కూడా పిలుతురు. మసూచియే మసూచికము, అదియే వాడుకలో మశూచకము అయినది.

## కారణములు

అలోపతీ వైద్యులు మసూచికమును అంటు వ్యాధి అందురు. మసూచికవ్యాధిలో నున్న వారి దేహములందు ఒక విధమైన క్రిములను వారు కనిపెట్టి ఉన్నారు. అందువలన వారు మసూచికమునకు ఆ క్రిమి కారణమను చున్నారు. అయితే ఆ క్రిమి ఒకరి దేహము నుండి మరొకరిదేహములోనికి నెట్లు వ్యాపించునో యిప్పటికినీ కనిపెట్టలేదు. అయినప్పటికీ వారుచూచిన సూక్ష్మజీవినే మసూచికమునకు కారణముగా తలంచుచుండుటవలన రోగము రాకుండా కాపాడవలెనంటే కూడా

టీకాలు వేయుట మంచిదని వారు తలచిరి. దానినే నిర్బంధముగా ప్రజలకు వేయుచున్నారు. దీనినుండి వచ్చు చెడును ముందు వివరింతును. ఆయుర్వేదము ఈ రోగముయొక్క కారణములను స్పష్టముగానే వివరించినది.

శ్లో॥ కట్వమ్ల లవణ క్షారవిరుద్ధాధ్యశనాశనైః
దుష్టనిష్పావశాకాద్యైః ప్రదుష్టపవనోదకైః ౧
క్రూరగ్రహేక్షణాచ్చాపి దేశే దోషా
స్సముత్థితాః
జనయన్తి శరీరేస్మిన్ దుష్టరక్తేన సఙ్గతాః ౨
మసూరాకృతి సంస్థానాః పీడకాస్స్యు
ర్మసూరికాః।

చేదు, పులుసు, ఉప్పు, కారముగల పదార్థములను భుజించుటయు, విరుద్ధములగు ఆహారములను భుజించుటయు, అన్నము జీర్ణముకానప్పుడు భుజించుటయు, పనికిమాలిన పదార్థములను భుజించుటయు, దుర్గంధముతో కూడిన గాలిని, మలినమైన నీటిని వాడుటయు, మసూచికమునకు ప్రత్యక్ష కారణములై ఉన్నవి. క్రూర గ్రహములగు కుజ, శని,

రాహువులు భూమికి సమీపముగా నుండుట
వలన, దేశ శీతోష్ణ వాతావరణములయందు
మార్పుకలుగుట వలన, ప్రజల దేహములందు
రోగ బహిష్కరణకు అనుకూలమైన కారణ
ములు ఏర్పడును. అందువలన రోగ సంచ
యములు అనుకూలమైన స్థానములందు గల
జనులకు నీ వ్యాధి కలుగును. ఈ వ్యాధికి
మసూచిక అనగా చిఱుసెనగలంత పొక్కులు
కలుగును. ఇది రక్తదోషమువలన కలుగునని
ఆయుర్వేద గ్రంథకారుల అభిప్రాయము.
అందువలన ఆరోగ్యవంతులకు నీ వ్యాధి
రాదనియు, అనారోగ్యకరములగు అభ్యాస
ములచే తమ దేహములందు రోగపదార్థమును
సంచితము చేసికొనినవారికే యీ వ్యాధి
కలుగుచున్నదనియు ఆయుర్వేదశాస్త్రజ్ఞులకు
తెలియును.

అందువలననే మసూచిక నిరోధమునకు టీకా
లను వాడియుండలేదు. ఆయుర్వేద గ్రంథము
లను శోధిస్తే మలమూత్రస్వేదకరములైన
నిరపాయకరమైనట్టియు, కషాయములు వాడి
యున్నారేగాని రస, విష, పాషాణములతో

చేసిన వంట ఔషధములనుగాని, ఖజ్జలీ ఔష ధములనుగాని, క్వైనా, నేలవేము మొదలగు వాటినిగాని, వాడినట్లు కనబడదు.

## లక్షణములు

మసూచికమునకు పూర్వరూపముగా జ్వరము వచ్చును. ఇది సాధారణముగా మసూచికము వచ్చిన రోగితో దర్శన, స్పర్శనాది సంప ర్కము కలిగినవారికే తరుచుగా కలుగు చుండుటవలన నిది అంటువ్యాధి అనియే చాలామంది అభిప్రాయపడుచున్నారు. మసూచికరోగి - ప్రక్కలో పడుకొనిన పిల్ల లకును మసూచికము రాకపోవుట మేము ప్రత్యక్షముగా చూచినాము అందువలన మసూచికము సంపర్కముతో మాత్రమే వచ్చేవ్యాధి కాదని తెలుచున్నది. మొదట రెండు వారములు బద్ధకము, ఆకలిలేకుండుట, మలబద్ధకము, ఉండును. జ్వరము నాలుగు రోజులు వచ్చును. ఇతర జ్వరములవలె కాకుండా వాంతులు, తలనొప్పి, నడుము నొప్పులతో గూడిన జ్వరము వచ్చును. వచ్చిన రోజుననే 103°, 104° డిగ్రీల వేడికలిగి

ఉండును. రెండు మూడు దినములలోనే ఈ జ్వరము 106°, 107° డిగ్రీలవరకు పెరుగును. జ్వరము వచ్చిన నాటినుండి రోగికి ప్రలాపముగాని, సంధిగాని, మగతగాని, అన్నీ కలిసిగాని, ఒకదాని తరువాత ఒకటిగాని ఉండును. ఒకరోగికి ఉన్నట్లు ఇంకొకరోగికి ఉండకపోవచ్చును. ఈ జ్వరములో వచ్చే సంధి మొదలగు వానిని చూచి ప్రాణాపాయము కలుగునని నిర్ణయించుటకు వీలులేదు. ఏమనగా నీ జ్వరములో అది ఉండనేఉంటుంది. అది ఉన్నాకూడ సాధారణముగా ప్రాణాపాయము రాదు.

మూడవరోజు వెళ్ళి, నాల్గవరోజు వచ్చేటప్పటికి గాని, నాల్గవరోజు వెళ్ళ అయిదవరోజు వచ్చేటప్పటికిగాని; సన్నని, ఎర్రని, పొక్కులు కనిపించును. అవి సూదితో పొడిచినట్లు కలిగే పొక్కులరంగుతో ఉండును. లేదా దోమలు కుట్టినంతగా ఉండును. నాలుగు, అయిదు, ఆరు, ఏడు, ఎన్మిది దినాలలో అవి చర్మతలమునకు పొక్కవచ్చును. పొక్కులు కనపడిన నాటినుండియు జ్వరముయొక్క తీవ్రత

102౦ డిగ్రీలకు తగ్గిపోవును. అయినప్పటికినీ సంధి, ప్రలాపము మొదలగునవన్ని ఉండనే ఉండును. ఆ రోజులలో మంటలు, పోట్లు, దురద మొదలగు బాధలు ఉండును. ఆ బాధ వలన రోగులకు మనస్స్థిమితము ఉండదు. కొందరు పక్కమీదనుండి లేచి లేచి పోవు చుందురు. ఈ లేచిపోవుటను గంగవెర్రి లందురు. ఇట్లు వచ్చు బాధలు రాత్రి పూట యెక్కువగాను, పగటిపూట తగ్గియు ఉండును. పగటిపూటకూడా బాధలు లేకుండా మాత్రము పోవు.

మొదటివారముగడచి రెండవవారము ఆరంభించు నప్పటికి పొక్కులు పొక్కుట పూర్తి యగును. వానికి గుమ్ములు ఏర్పడును. ఏడు ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు దినములలో బాగుగా పొక్కిన ఆ పొక్కుల నిండుగా శ్లేష్మము పేరును. దానిని నేతులు పోసి కొనుట అందురు. ఈ నాలుగు దినములలోనుకూడా బాధలు ఎక్కువగనే ఉండును. అయితే యీ రోజులలో గంగవెర్రులు మాత్రము ఉండవు. దురదలు, పోట్లును, మంట-

లును, ఎక్కువగనే ఉండును. పొక్కులు నిగనిగలాడుచుండును. కొన్ని పొక్కులు ఒక దానితో మరొకటి కలిసిపోవును. ముఖమున భావప్రకటన చేయుటకు వీలుగానంత బాధ యుండును. అనగా,కనుబొమలు ముడి వేయుట గాని, ముక్కు, చెక్కిళ్లు, కదల్చుటగాని, శక్యము కాకుండును.

11, 12 రోజులలో రోగి ముఖముమీాద పొక్కులయందలి నిగారింపు తగ్గిపోవును. వాని పై భాగమునందలి మొనలు దిగబడి, పొట్టలు ఏర్పడును, పొక్కులు ఒకటితో మరొకటి కలసిపోవును. మసూచికపు పోత ఒత్తుగా అనగా దగ్గర దగ్గరగా ఉన్న యెడల చాలా పొక్కులు కలసిపోవును. అవి నాలుగురోజులు అగునప్పటికి బాగుగా చలికిలపడి ఎండిపోవ నారంభించును. ఇట్లు 11,12 రోజులలో ముఖముమీాదను,12,13 రోజులలో స్కంధము మోచేతులపై భాగమునను, వాడిపోవ నారం భించును. 13,14 రోజులలో మోచేతులదిగువ భాగమునను,పిఱుదులు, మొలకట్టు, తొడలు మొదలగు భాగములమీాది పొక్కులు

వాడిపో నారంభించును. 14,15 రోజులలో మోకాటికి దిగువభాగమున వాడిపోవ నారంభించును.

ముఖముమీద పొక్కులన్నీ వాడిపోయిననూ, పాదముమీద పొక్కులు ఇంకను పచ్చిగానే ఉండును. అంతేకాకుండా నంజుచూపిన వారి పాదములవలె పాదములు లావగును. ఇరువది రోజులు అగునప్పటికి ముఖముమీద పక్కులు (ఎండినపొక్కులు) క్రమముగా రాలిపోవును. మిగతా భాగములలో నుండే పక్కులుకూడా అవరోహణ క్రమముగా నాల్గు, అయిదు రోజులు అగు నప్పటికి చాలాభాగము రాలి పోవును. ఇంకా అక్కడక్కడ కొన్ని పక్కులు ఉండినా అవికూడా క్రమముగా రాలి తీరును.

ఇట్లు మసూచికము సాంతముగా నయమగుటకు మూడు వారములు పట్టును. కొందరికి నాలుగు, అయిదు వారములలోకూడ పక్కులు రాలుటకద్దు.

మసూచికవు పొక్కులు చాలా మందికి ముఖము మీద ఎక్కువగా కన్పించి దిగువకుపోను



పోను తగ్గుటకలదు. కొందరకు ముఖముమీద తక్కువగా పోసి మిగతా భాగములలో ఒత్తుగా పోయుటయును కలదు. మసూచికపు పొక్కులను గుర్తుపట్టుటకు ఒక ఉపాయ మున్నది.

ఆటలమ్మ, పొంగు వేపపూత మొదలగునవి చర్మము మీదనే కనిపించును. మసూచికపు పొక్కులన్ననో అరచేతులలోను, అరకాళ్ళలోను, కూడా కనిపించును. అంతేకాకుండా ముక్కు లోపలి భాగములలోను; అంగిలియందును, నత్తపథయందును, స్వరపేటికయందును, ఆస నముసందును, యోనియందును, ఆహార నాళములయందును నీ పొక్కులు కని పించును. పురుషావయవము చివర ఉండే పోక మీదను, పొక్కులు కన్పించును. కొందరికి కంటిలో తెల్ల గుడ్డుమీదకూడ నన్నని పొక్కులు పుట్టి తగ్గిపోవును

మసూచికము స్త్రీలకు వచ్చినప్పుడు నాలుగు, అయిదు రోజులలో ఋతువు కానిపించును (ముట్టగుదురు) రజస్వాలా కాని యుక్తవయస్సు వచ్చిన ఆడుపిల్లలు ప్రథమ రజస్వాలా అగుదురు.

గర్భిణిగా నున్నయెడల గర్భస్రావమగును ఇది దాదాపుగా అన్ని కేసులలోను జరుగును. మసూచికము వచ్చిన తరువాతను, గర్భము నిలిచి కలిగిన శిశువు చాలా బలహీనముగా నుండును.

పొక్కులు వచ్చేటప్పుడు కనబడే లక్షణాల బట్టి పోత చర్మపుపోతఅని, కండపోతఅని, మారిపోతఅని మూడు రకములుగ నుండును. సన్నని యెఱ్ఱని పొక్కులు పుట్టిన యెడల దానిని ముత్యాలమ్మ చర్మపు పోతయని అందురు. కండలోపుట్టి వెడల్పుగా కనపడు పొక్కులకు కండపోతయని, ఉలవకాయ పోత అని అందురు. పుట్టినప్పుడే నీలపురంగుతో కలిసిన ఎరుపురంగుగా ఉన్నయెడల దానిని మారిపోత యందురు.

పోతకూడా అందరకు ఒక మోస్తరుగా పోయదు. కొందరకు కొన్నిచోట్ల వత్తుగాను, కొన్నిచోట్ల పల్చగాను పోయుటకలదు. కొందరకు దేహమంతటను పలచగాను, కొందరకు సామాన్యముగాను, కొందరకు దట్టముగాను ఈ పోత పోయును.

కొందరకు పోసిన పోత తేలకుండా అణగారి పోవును. కొందరకు పొక్కులు సరిగానే తేలి, చీములు పోయకుండానే మాడిపోవును.

మసూచిక వ్యాధిలోనుండగా నింకా కొన్ని క్రొత్త రోగములు కూడా రావచ్చు. ఊపిరి తిత్తులకు ఆవరణగానున్న పుప్పుసమునందు శ్లేష్మము ఎక్కువగా చేరి, కొందరకు శ్వాసా వరోధము కలుగును. దీనిని శ్వాసాశయ జ్వర మని, న్యుమోనియా అనియు, అందురు. కొం దరకు శ్వాసనాళములలో పుండుపుట్టి కాసతో కూడిన శ్వాసావరోధము కలుగును. ఇంకను కొందరకు సప్తపథలోను, స్వర పేటికయం దును, మంటలతో కూడిన పుండుపుట్టి శ్వాసా వరోధము కలుగును. పై లక్షణములతో కూడిన వ్యాధులు మిక్కిలి కష్టముపూదగాని నయముకావు. నయము కాకుండుటయు కద్దు. మారి పోతపోసిన వారిలో కొందరకు మశూ చికమువచ్చిన యెడు, ఎన్మిది రోజులలో మశూచికపు పొక్కులనుండియు, ముక్కు, గొంతు, ఆసనము, శిశ్నము, యోని, మొద లగువానినుండియు రక్తముస్రవించును. ఈ లక్ష

ణములుకల మశూచికము నయముచేయుట సాధ్యముకాదు. అయినప్పటికి యావజ్జీవము చికిత్సచేయుట న్యాయము కనుకను, బాధోపశమనము కలుగుచుండును గనుకను, కొద్ది కొద్దిగా కొందరు బ్రతుకుట తటస్థ మగుచుండుటచేతను, చికిత్సమాత్రము మానరాదు. గర్భిణీస్త్రీలకు మశూచికము వచ్చినప్పుడు సాధారణముగా గర్భస్రావము కలుగునని యిదివరకే వ్రాసి ఉన్నాము. పిడిగా స్త్రీలకన్న గర్భిణీస్త్రీలలో మశూచికము ఎక్కువ అపాయకరముగా ఉన్నట్లు కొందరు వ్రాయుచున్నారు. అయినప్పటికీ శ్రద్ధగా మొదటినుండియు స్వాభావిక చికిత్సాపద్ధతులను అవలంబించిన యెడల చాలామంది ప్రాణములను తప్పకుండా కాపాడవచ్చునని మేము నమ్ముచున్నాము.

## విరోధక మార్గము

పరిపూర్ణమైన ఆరోగ్య నియమముల అవలంబించుట ద్వారా దేహమును నిర్మలముగా ఉంచుకొనుటకన్న నిరోధకవిధానము ఇంకొకటిలేదు. రోగమును కలిగించే ఆహారవిహా

రాదులయందలి దురలవాట్లవలన దేహము నందు రోగపదార్థ సంచయములు ఏర్పడిన రోగులకైనను, టీకాలు మొదలగు అనారోగ్య కరములైన పద్ధతులవలన, రోగము రాకుండా చేసికొనవచ్చునని అలోపతీ వైద్యము వారు నమ్ముచున్నారు. అందువలననే మన దేశమున ప్రజల కందరకును టీకాలను వేయుచున్నారు. టీకాలు వేసినవారికి కూడా ఉలవకాయపోత, మారిపోత, పోసిన హారిని నే నెరుగుదును. అదీ కాకుండా అపూర్వమైన విధానముగా రోగ గ్రస్తమైన దేహాలలో మశూచికము రాకుం డా కాపాడినాకూడా ప్రకృతివైద్య శాస్త్ర వేత్త లెవరును దానిని సంతోషవార్తగా గ్రహింపరు. ఎందువల్లననగా టీకాలలోనుండే విషము, దేహములోనుండే ధాతుశక్తిని అణచి పెట్టుతుంది. అందువల్ల దేహములోఉండే రోగపధార్థము దేహములోనే నిలిచిపోతుంది. ఆ రోగపదార్థమువల్లనే చిత్రవిచిత్రములైన కాలికవ్యాధులు కలుగుచున్నవి. ఒక్కసారి మశూచికమువచ్చి దేహములో ఉండే మాలి న్యము అంతయూ వెడలిపోయిన తరువాత ఆ వ్యక్తి చిరకాలము బలముగాను, ఆరోగ్యము

గాను ఉండుటయేగాక, దీర్ఘాయువుకలిగి ఉం
డును. అందువలన టీకాలువేసి, మశూచికము
రాకుండా దేహమును కాపాడుకొనుటకన్న
పవిత్రియముగాను, స్వార్జితముగాను, దేహము
లందు మాలిన్యములు చేర్చుకొన్నవారికి ఒక
తూరి మశూచికము వచ్చిపోతేనే మేలని మనము
గ్రహించగలము. అందువలన ఆరోగ్యదాయ
కమైనపద్ధతులను అభ్యాసము చేసికొనుటయే
మంచినిరోధకవిధానమని అందుకువిరుద్ధముగా
అవలంబించే కృత్రిమమగు పద్ధతులన్నియు,
ఒకవేళ మశూచికమును రాకుండా చేయ
గలిగినను, అందువలన మేలుకన్న కీడే అనేక
రెట్లు ఎక్కువగానుండునని, సులభముగానే
గ్రహింపగలరు. అట్లు అణచిపెట్టబడిన రోగ
పదార్థము లోపలి ప్రాణావయవములగు ఊపిరి
తిత్తులు, హృదయము, జీర్ణావయవములు,
మూత్రికావయవములు, జననేంద్రియములు,
మెదడు, నాడీమండలము, మొదలగువానిని
పీడించి అసంఖ్యాకములగు మనోవ్యాధులను,
నాడీవ్యాధులను క్షయ, ఉబ్బసము, జీర్ణాశయ,
దాహము, వ్రణము, గ్రహణి, అతిసారము,
మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ, శిలామేహ...,

సికతామేహము, మొదలగు వ్యాధులనేగాక వంధ్యాత్వము, అమిత సంభోగేచ్ఛ, మదనోన్మాదము, యోషాపస్మారము, ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, పక్షవాతము, నాడీదాహము, నాడీవ్యథ, మొదలగు నెన్నియేని వ్యాధులను కలిగించుటకు సమర్థమై ఉండును. ఏ చికిత్సకు లొంగని పై మొండి వ్యాధులతో బాధపడుటకన్న ఒకసారి యిరువదిరోజులు బాధపడి, దేహమును నిర్మలముచేసికొనుటయే మేలని ప్రకృతి వైద్యవేత్త లెల్లరును నైక్యకంఠముగా చెప్పుచున్నారు.

ప్రజలకు మశూచికమంటే ఒకవిధమైన భయమున్నది. మశూచికములో విరూప మేర్పడు, ననియు, కన్నులు పోవుననియు, ప్రాణాపాయము సంభవించుననియు ప్రజలలో ఒక భీ తా వ ము న్న ది. ఈ భీ తి కి కారణమున్నూ కలదు. పూర్వకాలమున మశూచికమునకు చేయుచున్న చికిత్సలలో నెన్నో పొరపాట్లు ఉండేవి. వానిని గూర్చి చికిత్సా ప్రకరణములో ప్రస్తావించెదను. అందువలన నెన్నో అవాంతరములైన బాధలు

కలిగేవి. ఎంతోమంది అనవసరముగా మరణించేవారు. తప్పించుటకు వీలైన నెంతో అందవికారమున్నూ కలిగేది. మశూచికమునకు చేసిన అక్రమచికిత్సవలన కొందరికి కాకిచమ్మలు, ఉన్మాదమున్నూ, కలిగేది. ఇప్పుడు సహజములును, నిరపాయములును అగు ప్రకృతి వైద్యవిధానములు మన మెరిగి ఉండుటవలన నిప్పుడా బాధలన్నియు రాకుండానే మసూచికరోగికి చికిత్సచేయు వచ్చును. దాదాపుగా మశూచికరోగుల నందరను బ్రతికించవచ్చును. కనుక మశూచికమును నిరోధించుటకు ఆరోగ్యములను అవలంబించుట కన్న వేరుగా నెట్టి పద్ధతులను అవలంబింప నక్కరలేదని స్పష్టముగానే తేలిపోయినది.

## చికిత్సా ప్రక్రియలు

వివిధదశలలో అవలంబింపవలసిన చికిత్సా ప్రక్రియలను ముందుగా వ్రాసిన యెడల చికిత్స చెప్పునప్పుడు అవలంబించుటకు సులభముగా నుండును.

1. కటిస్నానము:—పై పటములో జూపినట్టి ఆకారముగల తొట్టిలో, రోగి కూర్చొన్న

ప్పుడు నాభిని, తొడలను, మిగుల కుండునట్లు నీరు పోయవలయును. రోగి దానిలో సగము చేరగిలబడి కూర్చొన్న తరువాత నొక ముతక నారబట్టతో విడువక కటిప్రదేశ మంతను (Around and Across) వెనుకను ముందును కూడ రుద్దుచునే ఉండవలయును. మొదట 5 మొదలు 10 నిమిషములు చాలును. తరు



వాత కొలదిగా హెచ్చింపవచ్చును. మిక్కిలి బలహీనులకును, శిశువులకును, మిక్కిలి తక్కువ నిముషములే చాలును. పాదములు, కాళ్లు, ఊర్ధ్వకాయములందు రక్తము తగ్గియే యుండును గాన మిగతా వానితో వానింజల్లపరు పక యున్నిదానితోఁ గప్పియుంచవలయును. కటిస్నానాంతరము వెంటనే దేహమును తిరిగి వెచ్చ పరుపవలయును. బహిరంగప్రదేశమున జేసిన వ్యాయామముచే నిదికలుగును. రోగ గ్రస్తులైన వారికిని, సుకుమారులకును, ముసుగు

బెట్టి వరుండబెట్టి ఉష్ణము కలిగింపవలయును. వేడి ఆలస్యముగా కలుగునేని దేహమునకు గుడ్డలు చుట్టి ఉంచవలయును. స్నానకాలము, ఉష్ణధర్మము, రోగి ననుసరించి ఉండవలయును.

2. లింగస్నానము:— స్త్రీలు చేయువిధము. తొట్టిలో మధ్య నొక యెత్తుపీట వేయవలయును. పీట పై అంచువరకే నీరు పోయవలయును. ఎత్తుపీట పై భాగము పొడిగా నుండవలయును. స్త్రీ ఆపీటపై దిగంబరముగా కూర్చొనవలయును. తరువాత ఒక మెత్తక గుడ్డ నీటిలోముంచి చేతికివచ్చినంత నీటిని పైకితీసి స్త్రీ యోనిముఖమును, పొత్తికడుపును, తుడువవలయును. కాని యోనియొక్క అంతరవయములజోలికి పోక పై పెదవులను (Outer lips) మాత్రము ప్రక్షాళన చేయుచుండవలయును. మోటుగా వెనుకకు ముందునకు రుద్దకూడదు. అంతట రోగికాని, ఉపచారకులుగాని, నడుము వద్దనుండి దిగువ మలుగులు నిలువుగను, అడ్డముగను రుద్దుచుండవలయును. లింగస్నానాంతరము వెంటనే స్వాభావికోష్ణత కలుగునట్లు వ్యాయామము

చేయవలెను. లేదా అదనముగా గుడ్డలుచుట్టి యైనను పరుండవలయును. ఋతుదినములందు లింగస్నానమాచరింపరాదు.

లింగస్నానములకెల్ల సాధ్యమైనంత శీతలోదకమునే వాడవలయును. స్నానము 10 నిమిషములు మొదలు ఒక గంటవరకు, రోగి యొక్క వయస్సు, ధాతుశక్తి ననుసరించి చేయవచ్చును. రోగి కూర్చుండుగది ముఖ్యముగా చలికాలములో వెచ్చగా నుండవలయును. రోగి భరింపగలిగినంతలో ఎంత శీతలోదకమైన, ఈలింగస్నానము లంతంత గుణతరముగా నుండును. శీతలదేశములందలి నీటియొక్క ఉష్ణధర్మమునకును, వాతావరణముయొక్క వేడికిని, గల సంబంధము మన దేశము నందలి నీటియొక్కయు, వాతావరణము యొక్కయు, ఉష్ణధర్మముల యన్యోన్య సంబంధమును, సామాన్యముగ ఒకటిగనే ఉండును. గాన జర్మనీలో దొరకునంత శీతలోదకము మనకు దొరకకున్నను దొరకిన దానిలో శీతలతరముగా నున్న నీటితోనే జర్మనీయందు వలెనే గుణమిచ్చితీరును.

మామూలు కటిస్నానపు తొట్టి దొరకనప్పు డేతొట్టియైనను లోపల నెత్తుపీటపట్టునట్లును 5, 6 బిందెల నీరు పట్టునదిగను ఉండిన జాలును. మిక్కిలితక్కువ నీరు పట్టునది యగు నేని నీరు వెంటనే వెచ్చబడునుగాన నీరు తగినంత పట్టుతొట్టి సంపాదించుకొనవలెను. బావులనీటికన్న తియ్యని ప్రవాహోదకము శ్రేష్ఠమైనది. బావినీరేగాని దొరకనప్పు డా నీటిని తొట్టిలో గొంతకాలముండనీయవలెను. వేడి యెక్కనీయరాదు.

పురుషులు చేయువిధము - స్త్రీలవలెనే పురుషులును తొట్టిలోవేసిన యెత్తుపీటపై దిగంబరముగా కాళ్ళుతొట్టివెలుపలకుండునట్లు కూర్చుండవలయును. తరువాత లింగముమీది చర్మము ను పోక కప్పునట్లుగా ముందుగా నీళ్ళలోనికి లాగి యెడమచేతితో చూపుడువేలు పెద్దవేళ్ళనందునగాని, పెద్ద వేలు అనామికనందునగాని, పట్టుకొని కుడిచేతితో ఒక జేబురుమాలుతో నీటిలోపలనే ఉన్న లింగాగ్ర చర్మమును కడుగుచుండవలయును. కొందరు చర్మములోపలి మెత్తని భాగమును రుద్దుచున్నారు.

కొందరు లింగమును యథావిధిగనే పట్టుకొని నీటిబయటనుంచి రుద్దుచున్నారు. కొందరు తొట్టిలోపల పీటవేసుకొని కూర్చొని తొట్టిలో లింగముంచి ప్రక్షాళన చేయుచున్నారు. ఇవన్నియు అక్రమపద్ధతులు, గాన కలుగ వలసిన ఫలితములు కలుగుటలేదు. స్వాస్థ్య సంకటములందు లింగాగ్రము పుండుపడు నేని నీటిని గిలకొట్టి లింగాగ్ర చర్మమునకు నీటి తాకుడు కలుగునట్లు చూడవలయును.

అంతర్గత దాహము, వ్రణములు గలవారు లింగస్నానము చేయుచో ప్రథమస్నానాంత రమే పైమంట మొదలగునవి స్నానము చేయు ప్రదేశమునకు చుట్టుపట్లను గాన్పిం చును. ఇట్టివి కలిగినప్పుడు భీతిల్లక పట్టుదలతో లింగస్నానము చేయుచునే ఉండవలయును. అవసరమగునేని యింకకొంచెము మెత్తని గుడ్డతోనే క్షాళనచేయవచ్చును. ఎత్తుపీట మీద మూడంగుళముల నీరుంచి లింగస్నాన మాచరించినచో ఫలిత మింకను త్వరితముగ గుణతరముగ నున్నదని కూనే ప్రత్యేకముగా

వివరించినారు. నీరు సాధ్యమైనంత చల్లగా నుండవలయును.

లింగాగ్రమునందు దేహమున్నందలి మజ్జా,నాడి యొక్కయు, ప్రధాన నాడీ మండలము యొక్కయు, చివరలు గలవు. కాన నిచ్చట చేసిన శైత్యోపచారములవలన నాడీమండలము, మెదడు, చల్లబడును. నాడులన్నియు నుద్దీపన బొందును. రోగపదార్థ మండ మరి కట్టబడి నాడులన్నియు బలపడును. ఇచ్చట చేసిన శైత్యోపచారము చెట్టునకు మొదట నీరుపోయుటవలె గుణమిచ్చును.

లింగస్నానము రోగులకు మాత్రమే ఉద్దేశింపబడినది. పరిపూర్ణ ఆరోగ్యవంతుల కిది అనవసరము. వీరి కిది విసుగును కలిగించును.

దేహమునందలి ధాతుశక్తి చెడియున్న దక్క, శీతలోదకము చేసిన లింగస్నానమునకు నత్యాద్భుతమును, ననన్యసామాన్యమును అగు రోగనివారక శక్తులుగలవు. దేహమునందు అత్యధికమగు ఉష్ణముండినప్పుడు దేహమునకును, అందును లింగాగ్రిచర్మమునందు చేసిన శైత్యోపచారమువలన ప్రకృతియం దంతటను

వలెనే నిమ్నోన్నతములు సమతను బొందును దీనికన్న స్వాభావికతరమగు చికిత్స యుండును.

3. మట్టిపట్టి - తొట్టిసంపాదించుకొనలేని పేదవారు ఈ ప్రక్రియతో జ్వరచికిత్సచేసి కొనవచ్చును. ప్రవాహోదకమునకు దిగువగా ఉండు ఒండ్రుమన్ను ఇందుకుమంచిది. ఎండిన ఒండ్రిగాని, నల్లరేవడిమీద ఎర్రిమన్నుగాని, కుమ్మరిమన్నుగాని, పుట్టమన్నుగాని, తీసికొని వచ్చి మెత్తగా పొడిచేసి చన్నీటితో కలిపి అదియైనను వాడుకొనవచ్చును. తొట్టిగల వారైనను, రోగి నీరసముగానుండి తొట్టిదగ్గరకు చేర్చుట కష్టమైనప్పుడును, మట్టిపట్టీలు వేయవచ్చును.

12 అంగుళముల పొడుగును 5 అంగుళముల వెడల్పునుగల పలుచని గుడ్డమీద 1 అంగుళము మందముగా మట్టిని మెత్తవలయును. ఆ మట్టిని పొత్తికడుపు అనగా నాభికి దిగువ భాగమునవేసి 15 నిమిషము లుంచవలెను. రోగి బలముగలవాడుగా నున్నయెడల ఒకటి తరువాత ఒకటిగా 4 మట్టిపట్టీలు ఉదయము

నందును, ఇట్లే సాయంకాలమునందును వేయవలెను. సామాన్యబలవంతులకు రెండేసిపట్టీల చొప్పునను దుర్బలులకు ఒకొక్క పట్టీ చొప్పున రోజుకు 3 పట్టీలు వేయవలెను.

4. నీలిసీసానీరు - ఒకనీలిసీసా సంపాదించి దానికి 7/8 భాగమువరకు నీరుపోసి, బిరడా పెట్టి ఒకదినమంతయు ఎండలో నుంచవలెను. జ్వరము తీవ్రముగా నున్నయెడల గంటకు ½ ఔన్సుచొప్పున ప్రతిగంటకును నీయవలెను.

5. నీలికాంతి - రాత్రిలందు 6 వత్తులకాంతి గల హారికేన్ లాంతరుకు ఒక నీలవర్ణరంగుగల అద్దము అడ్డముంచి ఆ వెలుతురులో రోగిని పరుండబెట్టవలెను. 100 డిగ్రీలకు ఎక్కువ జ్వరమున్నపుడే యీ కాంతిలో పరుండబెట్టవలెను. తగ్గినతోడనే అద్దమును తీసివేయవలెను. జ్వరము 103, 104 డిగ్రీలకు పైగా నున్నయెడల పెట్రోమాక్సు లైటు ఒకటి సంపాదించి మూడువైపులా మూసి ఉన్న ఖాళీపెట్టెలో దానినుంచి నాల్గవవైపున నీలి అద్దము అడ్డముపెట్టి ఆ రంగువెలుతురులో

రోగిని పరుండబెట్టవలెను. 100 డిగ్రీల జ్వరోష్ణము తగ్గినతరువాత కాంతిని తీసివేయువలెను.

6. ఆవిరిస్నానము -

చర్మగతమైన రోగముల నెలువరించుటలో ఆవిరిస్నానము ఎంతేని సమగ్రమైనది. రోగి తగినంత బలముగలవాడైనయెడలనే యీ ఆవిరిస్నానము చేయింపవలెను. ఏమనగా నిట్టి ఉష్ణోపచారము లన్నిటియందును రోగికి బలహీనతకలుగును. దీనికన్న ఆతపస్నానము మంచిది. కాన నెండలు లేనిరోజులలోను, రాత్రిలందు చెమట కలిగింపవలసిన యెడల నీ ఆవిరిస్నానము చేయింపవలెను. ఒక నులకమంచము మీాదగాని, పేము మంచము మీాదగాని, రోగిని దిగంబరముగా పరుండబెట్ట వలెను. ఆమంచముక్రింద 1,2 పాత్రిలలో బాగా మరగించిన నీటిని బెట్టి, వానిమీాది మూతనుతీసి, రోగికి హితవగునట్లు ఆవిరి రానీయవలెను. వెనుకవైపునను ముందువైపునను ఆవిరిపట్టవలెను. తరువాత చన్నీటితో స్నానముచేసి తడి తుడిచి తరువాత 10 నిమిషముల

పరిమితిగల చన్నీటి కటిస్నానము చేయ వలెను,

7. ఆతపస్నానము ఉదయము 8-11 గంటల మధ్యగానీ, సాయంత్రం 2-5 గంటలమధ్య గాని, ఆతపస్నానము చేయదగిన కాలము. వేసంగి యెండలలో 9 గంటల లోపలను సాయంత్రం 4 గంటల తరువాతగాని మాత్రమే ఆతపస్నానము చేయవలెను. అయితే రోగియొక్క బలమునుబట్టిన్నీ, రోగ ముయొక్క స్వభావమునుబట్టిన్నీ, వైద్య వరులు దీనిని మార్పుచేయదగిఉన్నారు. రోగితలకు ఎండ తగులకుండునట్లు తలనీడలో నుండునట్లు,పరుండబెట్టవలయును. లేదా తలకు గొడుగు వేయుటగాని, లేదా పెద్దగుడ్డ తల పాగాగా చుట్టుటగాని, చేయవలెను. తలను ఎండనుండి కాపాడితీరవలెను. ఈ పనిచేయ నిచో ఆ తపస్నానమువలన నెంతేని కీడు కలుగుతుంది. తరువాతరోగిని మంచముమీద గాని, నేలమీదగాని, నేలమీద చాపపరచి దానిమీద ఆకులు పరచి; దానిమీదగాని, పరుండబెట్టవలెను. తరువాత రోగి దేహము

మీద చేమాకులుగాని, తామరాకులుగాని, అరటియాకులుగాని, కప్పవలెను. ఎదురు రొమ్ముమీద నింకొక ఆకు అదనముగా కప్పవలెను. ఇట్లు రోగి హితవుగా భరింప గలిగినంతవరకు 30 నిమిషములు మొదలు 1 గంటవరకు పరుండబెట్టవలెను. రోగికి మధ్య మధ్య త్రాగుటకు మంచినీరు ఇచ్చుచుండ వలెను. రోగి మరీ బలహీనముగా నున్న యెడల మధ్య మధ్య పలకరించి యెట్లున్నదీ తెలుసుకొంటూ ఉండాలి.

తరువాత చన్నీటిస్నానము చేయించి తడి తుడిచి తొట్టిస్నానము చేయింపవలెను. ఆకులు దొరకనియెడల ఒక దుప్పటిగాని, రంగు లేని శాలువగాని, కప్పుకొని పరుండబెట్టవలెను. అప్పుడు బాగా చెమటపోస్తుంది. ఆ తరువాత వెనుకటివలెనే చేయవలెను. ఆకులు కప్పు, కొని పడుకొనుటకన్న గుడ్డ కప్పుకొని పడు కొనుట తీవ్రమైనది. ఆవిరి స్నానముకన్న ఆతపస్నానము చాలా మేలైనది. ఏమనగా సూర్యకాంతిలోని కొంత శక్తి యీ స్నాన ములో రోగికి లభిస్తుంది. ఆవిరిస్నానము

నందు వేడి, తేమా, ఉన్నది. సూర్యకాంతి యందు వేడియు కొంత శక్తియు ఉన్నవి. తేమ ఆకులలో ఉన్నది. దుప్పటి కప్పుకొన్నప్పుడు దేహామే ఆ తేమను అమరుస్తుంది.

8. కంబళిచుట్టు ఇది రెండు రకములు, తడి కట్టు, వేడికట్టు, తడికట్టువలన దేహముమీాది వేడిమి తగ్గును. వేడికట్టువలన చర్మముక్రింది మాలిన్యములు బయటికి లాగివేయబడును. చర్మమునకు వేడికలుగును. మిగతా విధాన మంతయు రెంటిలోను ఒకటిగనే ఉండును. తడికట్టునకు ఒక కంబళి రెండు దుప్పట్లు వాడవలయును. వేడికట్టునకు రెండు కంబళ్ళు, ఒక దుప్పటి వాడవలయును. ఇంకను ఈ క్రింది ఉపకరణములు కావలయును. (1) ఒక పెద్ద తుండుగుడ్డ, (2) పరిశుభ్రమైన మంచినీరు.

## 1 వ పటము దానికి వివరణ

1. ఒక మంచముమీాదగాని, బల్లమీాదగాని, చాపమీాదగాని, తలవైపున ఒక దిండునుంచి ఆ దిండు సగభాగమునకు పైగా బల్లమీాద అడ్డముగా ఒక తుండుగుడ్డను పరచవలయును. ఈ తుండుగుడ్డ పొడిగానే ఉండవలయును.

దాని పొడవు రెండు అడుగులు, వెడల్పు 2 అడుగులు, ఒకటవ పటము చూడుడు.

2. తరువాత 6 అడుగుల పొడవు 5 అడుగుల వెడల్పునకు తక్కువ లేకుండా ఉండు కంబళిని నిలువున పరచవలెను. తడికట్టునకు అయిన ఒక కంబళియే సరిపోవును. వేడికట్టునకు 2 కంబళ్ళను వాడవలెను. మొదట పరిచిన తుండుగుడ్డపై అంచునకు 2 అంగుళములు దిగువగా కంబళి పై అంచు ఉండునట్లు కంబళిని పరచవలెను. 2 వ పటము చూడుడు.

3. 5 అ$\times$4½ అ కొలతలుగల ముతక ఖద్దరు బట్టను చన్నీటియందు తడిపి పిండవలయును.

4. ఆ తడిబట్టను కంబళిపై పరచవలెను. కంబళి పై అంచునకు తడిబట్ట పై అంచు 2 అంగుళములు దిగువగా ఉండునట్లు పరచవలయును. 3 వ పటము చూడుడు.

5. తడిబట్ట పై అంచు రోగి భుజములపైన మూడు అంగుళములు ఉండునట్లుగా రోగిని ఆ తడి గుడ్డపై పరుండబెట్టవలయును. రోగి రెండుచేతులను పైకియెత్తించవలెను. తడిబట్ట

యొక్క ఒక వైపును శరీరము మీదికి కప్ప వలెను. ఆ పొరను పొట్ట, కటి ప్రదేశముల మీదికిని ఒక కాలుమీదికిని చుట్టవలయును. ఈ పొరలోనికి రెండవ కాలును చేర్చరాదు. 4 వ. పటము చూడుడు.

6. తరువాత రోగిచేతులను రెంటిని అతను ప్రక్కలయందు చేర్పించి తడిబట్ట రెండవ వైపును రెండు చేతులమీదికిని రెండవ కాలున కును కలిపి చుట్టవలెను. తడిబట్ట శరీరమునకు చుట్టుటలో శరీరమునందు అన్ని భాగము లకును చక్కగా అని ఉండవలెను. మడతలుం ఉండరాదు. ఇట్లుచేసినప్పుడు త్వరితముగా ప్రతిక్రియకలుగును. 6వ. పటముచూడుము.
7. తరువాత కంబళ్ళను శరీరముమీద అన్ని వైపులా అని ఉండునట్లును, గాలిచొరబడు టకు నేమాత్రము వీలులేనట్లును చుట్ట వలయును. కంఠమువద్దను పాదములవద్దను బాగుగా చుట్టవలయును. 6, 7 పటములను చూడవలయును.

8. కంఠమువద్ద గాలి లోనికి పోకుండుటకై మొదట పరచిన పొడితుండుగుడ్డను కంఠము

# కంబళిమట్టి



1 వ పటము.



2 వ పటము.



7 వ పటము.



8 వ పటము.

చుట్టును చుట్టవలెను. 8 వ పటము చూడుము.
రోగిబలహీనుడైనపుడు కంబళిపొరలు చాలక
చలికలిగినయెడల చక్కని ప్రతిక్రియ కలు
గుటకై మరియొక శాలువను పైన కప్పవల
యును. గొంగళిచుట్టలో 15 నిమిషములు
మొదలు 40 ని. వరకు రోగిని ఉంచవలయును.
రోగి బాధకలిగినదని చెప్పినయెడల కట్టువిప్పి
వేయవలయును. ఈకాలములో నిద్రవచ్చిన
యెడల రోగిని నిద్రనుండి తాను స్వయముగా
లేచువరకును లేపరాదు. కట్టులో నున్నప్పుడు
కలిగిననిద్ర అమృతమువలె పనిచేయును.
కట్టు తీసివేసినతరువాత నులివెచ్చని నీటితో
శరీరమునంతను కడగవలయును, లేదా తుడువ
వలయును. ఇట్లు కంబళిచుట్ట వేసినపుడు చర్మ
గతములైన దోషములు పైన కప్పిన తడి
దుప్పటిలోనికి వచ్చును అందువలననే
ఆదుప్పటి మురికివాసన కొట్టును. రాక మిగిలి
పోయిన దోషములు దుప్పటిలోని తడివలన
నాని యింకొకతూరి వెలువడుటకు సిద్ధముగా
నుండును. కంబళిచుట్టలోనుండి రోగి బయటకు
వచ్చినతరువాత చన్నీటితో కూడా స్నానము

చేయింపవచ్చును. ఆ వివరము ముందు వ్రాసె
దను. తరువాత తడి తుడిచి 10 నిమిషముల
పరిమితిగల కటిస్నానముగాని 15 నిమిష
ముల పరిమితిగల మట్టిపట్టీగాని, 7, 8 నిమి
షముల పరిమితిగల లింగస్నానముగాని
చేయింపవచ్చును.

9. వేడినీటిపాదస్నానము - ఒక డేకిసాలో
110 డిగ్రీల వేడినీటినిపోసి అందులో రోగి
యొక్క రెండుపాదములను పెట్టవలయును.
రోగి దేహమునంతను కప్పునట్లును క్రిందనున్న
డేకిసాను చుట్టునట్లును ఒకశాలువను కప్ప
వలెను. నీటివేడి తగ్గిపోయినప్పుడెల్ల వేడినీటిని
కొద్దిగా చేర్చవలెను. 15 నిమిషములు
అయినతరువాత పాదములను చన్నీటితో
కడగవలెను.

10. చన్నీటిపాదస్నానము - కుండలో వుంచి
చల్లబరిచిన చన్నీటిని ఒక డేకిసాలో పోసి
రోగిపాదములను నీలమండలు మునుగునట్లుగా
అందుంచ వలయును. 15 నిమిషములు ఉన్న
తరువాత రోగిపాదములు నీటినుండితీసి తడి
తుడిచి చేతితోగాని, మెత్తని తుండుగుడ్డతో
గాని వేడి యెక్కునట్లు రుద్దవలయును.

## చికిత్స

చికిత్స వ్రాయుటకు ముందు ఒక విషయమును జ్ఞప్తికి తేవలెను. ఏమనగా మశూచిక వ్యాధికి 7 దశలు గలవు.

1 ప్రారంభదశ. ఈ దశలో దేహమునందు పాలుమాలిక, నిస్సత్తువ, నిరుత్సాహము, అన్నమునందు నిచ్ఛలేకుండుట, అన్నము హితవుగా నుండకపోవుట, మలబద్ధకము, తల దిమ్ముగానుండుట, వెన్నులో సన్నని నొప్పిగా నుండుట మొదలగు లక్షణములుండును.

2 జ్వరపుదశ. రెండవదశలో తీవ్రమగు జ్వరము, తలనొప్పి, వెన్నుపాములోనెక్కడనో ఒకచోట నొప్పిగా నుండుట, మెడలోగాని, వెన్నులోగాని, నడ్డిలోగాని, మలుగులలో గాని, నొప్పిగానుండుట; వాంతులు, దేహ మంతయు మంటలుగానుండుట,

3 మూడవదశ. దీనినే పొక్కుదశ అందురు. ఈ దశలో దేహముమీద పొక్కులు పుట్టి వృద్ధిపొందును.

4 చీముదశ- ఈ దశలో చీము పోసికొనును.

5 వాడుదశ- ఈ దశలో చీముపోసికొన్న పొక్కులన్నియు వాడిపోవ నారంభించును.

6 ఎండుదశ - వాడిపోయిన పొక్కులనియు నెండిపోవును. దీనిని పక్కు దశఅని కూడా అనవచ్చును.

7 నిర్మాణదశ- ఈ దశలో పక్కులన్నియు రాలిపోవుటయేగాక దేహమునందు బలము చేకూర నారంభించును. ఈ వివిధదశలలోను చేయవలసిన చికిత్సాపద్ధతులను నీ క్రిందవివరించుచున్నాను.

### 1. ప్రారంభదశ

ఈ దశలో చికిత్స ప్రారంభించిన యెడల మశూచికమువలన ప్రాణాపాయము సంభవించదు. మశూచికముకూడా చాలా తేలికగా పోసి, సులభముగా తేలిపోవును. అందువలననే యీ దశను గుర్తించి చికిత్స చేసుకొనుట చాలా అవసరమై ఉన్నది. ఎంతో లాభమును ఉన్నది. అందువలన నీదశలో నీ క్రింద విధమైన చికిత్సచేయవలెను.

### కార్యక్రమము

ఉదయము- 6-0 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చుకొనుట.

6-30 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

7-30 గంటలకు 3 పైంట్ల చన్నీటితో రెండు పర్యాయములు ఎనిమా చేయవలెను.

9-0 గంటలకు చన్నీటి శిరస్స్నానము.

10-30 గంటలకు పది తులముల ముడిబియ్యపు అన్నమును 40 తులముల వండి వార్చిన కూరతో తినవలెను. 10 తులముల తీపి మజ్జిగను పోసికొనవలెను. భాగ్యవంతులుగా నున్నవారు రసవంతములగు నారింజ, కమల, బత్తాయిలను రెండుపూట్లనూ వాడవచ్చును.

1-0 గంటకు 3 తీపి నారింజపండ్లను తినవలెను.

4-0 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

4-30 గంటలకు ఎండలో 2 మైళ్లు నడక.

5-30 గంటలకు కొంచెము వేడినీటి శిరస్స్నానము.

వారమునకు రెండు రోజులు ఆతపస్నానము చేయవలెను.

సాయంకాలము 4 గంటలకు మొదలుపెట్టి ఆతపస్నానమైన తరువాత 10 నిమిషముల

పరిమితిగల చన్నీటి కటిస్నానము చేయ వలెను.

7-30 గంటలకు 6 తీపి నారింజ కాయలను గాని, బత్తాయిలనుగాని తినవలెను.

10-30 గంటలకు నిద్ర.

పేదలుగా ఉండేవారి క్రింది కార్యక్రమ మవలంబింపవలెను

ఉదయం 6-0 గం. నిద్రలేవవలెను, కాలకృత్యములు తీర్చుకొనవలెను.

6-30—6-45 గం. వరకు పొత్తికడుపుమీద మట్టిపట్టీ.

7-30 గం. చన్నీటితో ఎనిమా 2 తూరులు తేపకు 3 పైంటుల నీటిని వాడవలెను.

9-0 గం. చన్నీటితో శిరస్నానము - స్త్రీలకు అయిన యెడల కంఠస్నానము.

10-30 గం. ముడిబియ్యపు అన్నము, 10 తులముల బియ్యము వండవలెను, 40 తులముల కూరగ వండవలెను. దానిని అన్నముతో తినవలెను, 10 తులముల తీపి మజ్జిగ వాడవచ్చును.

3-0 గంటలకు 3 నారింజపండ్లు రసముగాని,
1 నిమ్మకాయ రసములో 15 ఔన్సుల
నీటిని కలిపి అదిగాని త్రాగించవలెను.

4-30—4-45 గం వరకు పొత్తికడుపుమీాది
మట్టిపట్టీ.

4-45—6-0 గం. ఎండలో నడక.

6-10 గం. నులివెచ్చని నీటితో కంఠస్నానము.

7-30 గం. 16 ఔన్సుల తియ్యని మజ్జిగ.

10-30 గం. నిద్ర, వారమునకు 3 తూరులు
ఆతపస్నానముగాని, కంబళిచుట్టగాని,
వేయవలెను.

ఈ పద్ధతులు అవలంబించిన యెడల మశూచి
సంబంధమైన పాలుమూలిక యగు నెడల
జ్వరము తగ్గివచ్చి, మశూచికము తేలిపోవును.
ఇతర పాలుమూలిక యగునెడల పాలుమూలిక
పోయి ఉల్లాసము, ఓపిక వృద్ధియగును.

రెండవదశ - జ్వరము

ఈ దశలో శ్రద్ధగా చికిత్స చేసిన యెడల
మశూచికము ప్రమాదకరముగా నుండక సుల
భముగా తేలిపోవును. ఈ దశవఱకు సాధార
ణముగా మన వైద్యులోని కెవ్వరును రారు.

ఇప్పటినుండి చికిత్స చేసినను, చాలమేలు కలుగును.

జ్వరము తగ్గించుటకు దీర్ఘములగు కటిస్నానములు చేయుటవలన చాలా ప్రమాదములు సంభవించును. జ్వరమును పోగొట్టుటకై, క్వైన, జ్వరహారి, మొదలగు మందులు వాడినప్పుడు అనేకమందికి ప్రాణాపాయము సంభవించినది. అందువలన మశూచిక జ్వరమునకు హోమోపతి మందులుకూడా వాడతగదు. మశూచిక జ్వరమును మొదటినుండియు గుర్తుపట్టుటకు వీలున్నది. జ్వరము 104 డిగ్రీలతో వచ్చుట, తలనొప్పి, నడుమునొప్పి, యివి ప్రధానలక్షణములుగానుండును. వాంతులుగూడ నుండును. అందువలన మొదటినుండియు కనిపెట్టి దీనికి నెట్టిమందులను వాడరు. యూరపు మొదలగు దేశాలలో నీ జ్వరమును తగ్గించుటకు ప్రయత్నముచేసి అనేకమందిని కోల్పోయి ఉన్నారు. తరువాత వారును శ్రద్ధతీసికొని మందుల వాడుట మానినారు.

మశూచిక జ్వరమును తగ్గించుటకు వాడిన హోమోపతీ మందులవలనకూడా అపకారము

జరుగుతుంది. జ్వరము నాలుగు రోజులలోను ఈ క్రింది కార్యక్రమమును అవలంబించవలెను.

6- 0 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చికొనవలెను.

6-30 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

7-30 గంటలకు చన్నీటి ఎనిమా, ఎనిమామూను పైంట్లు చన్నీటితో చేయవలెను, ఇట్లు రెండు పర్యాయములు చేయవలెను.

8-30 గంటలకు కొంచెము వేడినీటి శిరస్స్నానము.

10-30 గంటలకు 5 తీపినారింజలుగాని, కమలాఫలములుగాని, బత్తాయిలుగాని, తినవలెను.

1-30 గంటకు 45 నిమిషముల పరిమితిగల గొంగళి చుట్టను వేయవలెను. తడిగుడ్డ రెండుపొరలు గొంగళి ఒక పొర వేయవలెను. గొంగళిచుట్టు వేసిన తరువాత చన్నీటి శిరస్స్నానము చేయవలెను.

4-30 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

6-30 గంటలకు 6 తీపినారింజ కాయలుగాని, కమలాఫలముగాని, బత్తాయిగాని, వాడవలెను. పచ్చి ద్రాక్షపండ్లను వాడవలెను.

9-30 గంటలకు నిద్ర.

## పేదవారలకు

6-0 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చి కొనుట.

7-30 గంటలకు తొట్టిస్నానము చేయవలెను. తొట్టి స్నానము సంపాదించుకొనలేని వారు ఒక్కొకటి 15 నిమిషముల పరిమితిగల రెండు మట్టిపట్టీలను వేయవలెను. మట్టిపట్టీ వేసుకొను పద్ధతిని లోగడనే వచించడమైనది.

7-30 గం. ఎనిమా డబ్బా సంపాదించుకోలేని వారు వేడినీటిలో నిమ్మకాయ రసం పిండి 1 పైంటునీరు త్రాగవలెను.

8-30 గంటలకు చన్నీటి శిరస్నానము.

10-30 గంటలకు 1 భాగము తియ్యని పెరుగును 6 భాగముల నీటితో కలిపి చిలికి వెన్నతీసివేసి ఆ మజ్జిగను నీయవలెను.

1-30 గంటకు గొంగళిచుట్టను 45 నిమిషముల పరిమితితో వేయవలెను. గొంగళి సంపాదించుకోలేనివారు వేప ఆకును తెచ్చుకొని సాయంకాలము 4-30 గం. నుండి ఆ వేపఆకులో పడుకోవలెను. 45నిమిషములు పడుకోవలెను. ఈ లోపుగా కష్టముగా నున్న లేవవచ్చును. లేచినతరువాత చన్నీటి శిరస్స్నానము చేయవలెను.

5-30 గంటలకు ఒక్కొక్కటి 15 నిమిషముల పరిమితిగల రెండు మట్టిపట్టీలు వేయవలెను.

6-30 గంటలకు ఉదయం మాదిరిగనే నీటితో కలిపిన మజ్జిగను నీయవలెను.

9-30 గంటలకు నిద్ర.

జ్వరకాలమున దాహముగా నున్నయెడల మంచినీటిని నిచ్చుచుండవలెను. సంధిప్రలాపము ఉన్నయెడల నుదుటిమీద ఎనిమిది

మడతలు మడచిన జేబురుమాలను వేయ వలెను. కుండలోపోసి నిలవయుంచిన మిక్కిలి చల్లని నీటిలో ఆ పట్టీని తడిపి తిరిగి వేయు చుండవలెను. తల నొప్పి, యెక్కువగా నున్న యెడల దినమునకు రెండు మూడు తూర్లు వేడినీటి పాదస్నానము చేయించవలెను. వెన్ను నొప్పిగా నున్న భాగమునందు 4మడ తలు తడిగుడ్డనువేసి దానిపైన రబ్బరుతిత్తిలో గాని, సీసాలోగాని, రోగి హితవు ననుసరించి తగినంత వేడినీటిని ఉంచి కాపు పెట్టవలెను. సంధిలో రోగి లేచిపోవుచున్న యెడల పోగూడని చోటులకుపోయి ప్రాణాపాయము తెచ్చుకోకుండా ఉండగలందులకుగాను రోగిని కనిపెట్టి ఉండవలెను.

## మూడవది పొక్కు దశ

ఈదశలో ప్రకృతి వైద్యము ప్రారంభము చేసినా ప్రాణాపాయము లేకుండా తప్పించ వచ్చును. ఈ దశలో జ్వరము కొంచెము తగ్గును. సాధారణముగా 101°, 102° డిగ్రీల కన్న నెక్కువ ఉండదు. తేలికపోతలో నింకనూ తగ్గిననూ తగ్గవచ్చును. పొక్కు

దశలో ప్రారంభమునుండి కంపరము, దురద, ఉండును. రోగికి చికాకు ఉండును. సంధి, ప్రలాపములును ఉండవచ్చును. ఇతర జ్వరములలో జ్వరము తగ్గినప్పుడు సంధి ఉండుట మంచిలక్షణముకాదు. మశూచికము నందన్ననో జ్వరము తగ్గినపుడు ప్రలాపము ఉండుట ప్రమాదలక్షణముకాదు. ఈ దశలో నీ క్రింది కార్యక్రమమును అవలంబించవలెను.

6-0 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చుకొనుట.

6-30 గంటలకు 10 నిముషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

7-30 గంటలకు 3 పైంట్ల చన్నీటితో ఎనిమా చేయవలెను. ఇట్లు రెండు పర్యాయములు చేయవలెను.

8-30 గంటలకు కొంచెము వేడినీటి శిరస్స్నానము.

10-30 గంటలకు 6 తీపి నారింజకాయలనుగాని, కమలా ఫలములనుగాని, బత్తాయిలనుగాని, వాడవలెను. పచ్చిద్రాక్షపండ్లను ఈయవలెను.

1-30 గంటలకు ఒకవంతు పాలను 4వంతులు నీళ్లను కలిపి దానిలో గుడ్డను తడిపి గొంగళిచుట్టను వేయవలెను. గొంగళి చుట్టను 45 నిమిషములు వేయవలెను. లేచినతరువాత చన్నీటి శిరస్స్నానము చేయవలెను.

4-30 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటికటిస్నానము.

6-30 గంటలకు ఉదయము మాదిరిగనే పండ్లను తినవలెను.

9-30 గంటలకు నిద్ర.

పేదవారలకు

6-0 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చికొనుట.

6-30 గంటలకు ఒక్కొక్కటి 15 నిమిషముల పరిమితిగల రెండు మట్టిపట్టీలు.

7-30 గంటలకు మూడు పైంట్ల చన్నీటితో ఎనిమా చేయవలెను. ఇట్లు 2 పర్యాయములు చేయవలెను.

8-30 గం. చన్నీటి శిరస్స్నానము.

10-30 గం.4 భాగములు వండి వార్చని కూరను 1 భాగము ముడిబియ్యపు అన్నముతో తినవలెను. ఒక్క కూరతోనే తృప్తిపడి ఉండుట మంచిది. లేనిచో పైన చెప్పి నట్లుగా అన్నమును కూరను తినవలెను.

1-30 గంటలకు గొంగళిచుట్టను వేయవలెను. నీతులముల బెల్లమును 2 పైంట్ల నీటిలో కలిపి దానిలో గుడ్డను తడిపి గొంగళి చుట్టను 45 నిమిషములు వేయవలెను. లేచినతరువాత చన్నీటి శిరస్స్నానము చేయవలెను.

4-30 గంటలకు 10 నిమిషముల పరిమితిగల చన్నీటి కటిస్నానము.

6-30 గంటలకు ఉదయము మాదిరిగనే భోజనము చేయవలెను.

9-30 గంటలకు నిద్ర.

ఈ దశలో వచ్చుచుండు కొన్ని లక్షణములను కనిపెట్టి యింకను కొంత అదనపు చికిత్స చేయుచుండవలెను. పొక్కులు బాగుగా తేలి దురద, మంట, యెక్కువగా నున్నయెడల 18×24 అంగుళముల గుడ్డను ఎన్మిది మడ

తలుగా మడచి చల్లని నీటిలో తడిపి యెక్క
డెక్కడ మంటలుగా నుండునో అక్కడల్లా
5 నిమిషముల చొప్పున చల్లబఱచుచుండ
వలెను. దేహమునందంతటను కంపరమున్న
యెడల చన్నీటిలో ముంచిన తడిగుడ్డతో
దేహమంతయు తడపవలెను.

పొక్కులు సరిగా తేలక రోగి స్మృతి తప్పి
ఉన్న యెడల రోగిని ఒక చీకటి గదిలో
పరుండబెట్టి అక్కడనే ఒక లాంతరుకు
ఎర్రని అద్దము అడ్డముపెట్టి ఆ వెలుతురును
రోగిమీద ప్రసరింపచేయవలెను.

ఇట్లు ఒకగంటసేపు ఉంచిన తరువాత రోగిని
వెలుతురులో పరుండబెట్టవలెను. కంపరము
ఎక్కువగా నున్నప్పుడు రాత్రులందు నిద్ర
పట్టని యెడల ఒకటి రెండు తూకులు గవ్వ
పలుకు సాంబ్రాణిగాని, అగరుగాని, మంచి
గంధపుపొడిగాని, రోగికి ధూపము వేయ
వలెను. నుదురుమీద తడిగుడ్డపట్టీ వేయ
వచ్చును. పాదములు చన్నీటి తొట్టిలో
15 నిమిషములు ఉంచి తడిపి అద్ది పొడిగుడ్డ
కప్పి పరుండ బెట్టవలెను. బాగుగా ఉతికిన

మెత్తని పక్కమీద రోగిని పరుండబెట్ట వలెను. ఏమనగా ఆరోజులలో పక్క గట్టిగా నున్నయెడల రోగికి ఒత్తుకొనును. పక్క కుదరక నిదరపట్టదు. దరిద్రులుగా ఉండు వారు లేత వేపఆకు గాని, వెలగలాకు గాని, తామరాకుగాని, చేమఆకుగాని, దూసికొని వచ్చి పక్కమీద పోసి, పైన ఒకగుడ్డపరచి పరుండబెట్టవచ్చును. కలవారు లేత అరటి మొవ్వలను పక్కపై పరవవచ్చును. ఈ దశలో రోగి యెంతో బాధపడు చుండును. రోగికిచేయు ఉపచారములు రోగిబాధను తగ్గింపలేకపోవును. అయినప్పటికీ విసుగుకో కుండా రోగికి ఆయా కాలము లందు కావల సిన ఉపచారములను చేయుచునే ఉండవలెను. ఈ దశలో రోగికి రాత్రులందు బాధ యెక్కు వగా ఉండును. పగలు బాధ తగ్గి ఉండును. రాత్రులందు నిదర సరిగా పట్టదు. పట్టినను బాధవలన అప్పుడే మెలకువ వచ్చును. ఒకరు, ఇద్దరు కాచుకొని ఉండి, వంతులు వేసుకొని రోగికి ఉపచారము చేయుచుండవలెను.

## నాలగవదగు చీముదశ

ఈ దశలో తగ్గిపోయిన జ్వరము ఎక్కువగును. పొక్కులలో నిగనిగలాడు శ్లేష్మద్రవము, అనగా చీము చేర నారంభించును. నాలుగుదినములలో క్రిమక్రిమముగా దేహముమీద నుండు పొక్కు లన్నిటి యందును చీము నిండుకొనుటయే గాక చర్మమునకు ఎంతతక్కువ ఒత్తిడి తగిలినను బాధ యెక్కువగా నుండును. ఈ దశలో పెద్దచికిత్సలు ఏమియు చేయుటకు వీలులేదు. రోగిని అటు, ఇటు, కదిలింపవలసి వచ్చినప్పుడు కూడా రోగిని ఒకగుడ్డలో నుంచి ఆగుడ్డ జోలెను కదలింపవచ్చునే గాని, రోగిని ముట్టుకొనుటకు వీలులేదు. ఆసనము అంతయు చీము పొక్కులతో నిండియుండును గాన సాధ్యమైనంతవరకు ఎనిమాకూడా చేయుటకు వీలులేదు. ప్రేగులలో మలము ఎక్కువగా చేరి బాధ కలిగించునప్పుడు మాత్రమే యెక్కువగా ఆముదమును ఆసనమునకు రాచి ఎనిమా చేయవచ్చును. రోగికి నీదశలో నొకటి రెండుదినములవరకు మాత్రమే కంబళి

చుట్ట వేయవచ్చును. అది కూడా రోగికి హిత
వుగాలేని యెడల మానివేయువచ్చును. ఈ
దశలో దేహ మంతయు చీముతో నిండి దుర
దతో గుల, గుల ఆడుచుండును. ఎంతపెద్దవా
రైన రోగులైనను దురద వలన గోకుకొనుటకే
ప్రియత్నింతురు. దురదఫుట్టు నప్పుడెల్లా వేరు
శనగనూనె కలియుని మంచినువ్వులనూనెతో
తరుచుగా దురదకలిగిన భాగములం దెల్ల
తడుపు చుండుటవలన అప్పటి కప్పుడు దురద
తగ్గుచుండును. దురద యెక్కువగా నున్న
భాగములందు 12×9 అంగుళముల మెత్తని
గుడ్డను ఎనిమిది మడతలుగా మడచి, తడపి
ఆయా భాగములందు వేయుచుండుట వలన
గూడా దురద తగ్గుటయే గాక మానినతరువాత
గుంటలు లేకుండా పోవును.

ఈ దశలో రోగిని కదలించి తొట్టిస్నానమును
చేయించుటకు వీలుండదు. అందువలన రోగిని
పక్కమీదనే ఉంచి, పొత్తికడుపుమీద ఉద
యముపూట ఒకసారి, సాయంకాలముపూట
ఒకతూరియు- ఒక్కొక్కటి 15 నిమిషముల
పరిమితిగల రెండేసి మట్టిపట్టీలను వేయవలెను.

ఈరోజులలో రోగిని శక్తికలవారు కేవలము పండ్లనే పెట్టుట మంచిది. శక్తిలేనివారు ముడి బియ్యపు అత్తిసరు అన్నమును, అన్నమునకు మూడురెట్లు వండిన కూరను చేర్చి, దినమునకు ఒకటి, రెండు తూరులు తినిపించవలెను. పూర్వకాలపువారు రోగులకు నీ దశలో వండిన పప్పు పదార్థములను, గుగ్గిళ్ళను తినిపించెడివారు. అంతే కాకుండా పెరుగువేసి అన్నము పెట్టుచుండిరి. అందువలన రోగులకు చీము ఎక్కువగా పోయుటయు, గుంటలు లోతుగా పడుటయు, ప్రాణాపాయము సంభవించుటయు జరుగుచుండెడిది. ఆ పద్ధతులను మానివేసి పథ్యవిషయములో శ్రద్ధతీసికొనుట వలన పదమూగ్గురు రోగులలోను, 40 రోజుల శిశువు ఒకటి తప్ప మిగిలిన వారందరును బాగానే యున్నారు. చర్మము మీద లోతైన గుంటలు పడలేదు. చూపుపోవుట గాని, న్యూమోనియా మొదలగు వ్యాధులు వచ్చుటగాని సంభవింపలేదు. మశూచికము ప్రాణాపాయకరమైనది కాదనియు, ఇతర అన్నితరుణ వ్యాధులవలెనే అదియును కుదురు ననియు నమ్ముచున్నాము.

రాత్రిలయందు ఈ దశలో కూడా రోగులకు నిద్ర ఉండదు. మరద కూడా పగటికన్న నెక్కువగానే ఉండును. అందువలన ఈ దశలో కూడా రోగిని కనిపెట్టుకొని శ్రద్ధగా ఉపచారములు చేయుచుండవలయును. నువ్వుల నూనె తరచుగా రాయుచుండుటవలన అప్పటి కప్పుడు బాధ ఉపశమించి రోగికి నిద్రపట్టుటకు వసతి కలుగును. అగరు, మంచిగంధపుపొడి, సాంబ్రాణి మొదలగు వానితో ధూపము వేయుటవలన చర్మమునందలి పెళుసుతనము తగ్గి బాధ ఉపశమించును. అందువలన తాత్కాలికముగా కొద్ది కొద్ది నిద్ర పట్టు చుండును. కనుక రోగిని కనిపెట్టుకొని ఉండి నూనె రాయుటయో, ధూపము వేయుటయో, చేయుచుండవలెను. ఇట్లు చేసినప్పుడు రోగికి నిరాశ కలుగకుండుటయేగాక తాత్కాలిక మగు బాధోపశమనమును కలుగుచుండును.

ఈ దశలో శ్లేష్మము ప్రకోపించును. గొంతులో గురక యుండవచ్చును. శ్వాసనాళముల యందు వుస్ఫుసములోపలను శ్లేష్మము చేరి శ్వాసావరోధమున్నూ కలుగును. మూత్ర

ముతో నుద్దకట్టుకూడా పడవచ్చును. జిగురుతో కలసిన విరేచనములును కావచ్చును. ఇట్టి బాధలు కలిగినపుడు అన్నము పెట్టుట మానివేయవలెను. రోగిని దినమునకు ఒకటి, రెండుగంటలు ఎర్రరంగు అద్దము అడ్డము పెట్టిన లాంతరు వెలుతురులో పరుండ బెట్టవలయును. అది లభింపనివారు రోగిపైన నెర్రని పలుచని వస్త్రమును ఒకటి రెండు గంటలు కప్పి ఉంచవలెను. దీనితో శ్లేష్మము తగ్గిపోవును.

## అయిదవదగువాడుదశ

ఈ దశలో జ్వరము క్రమముగా తగ్గిపోవును. నిగనిగలాడు పొక్కులలోని నైగనిగ్యము తగ్గిపోవును. పైకి పొడుచుకొని వచ్చిన పొక్కుల పైభాగములు చతికిలపడి గుంటలు ఏర్పడును. పొక్కులు ఒకదానితో ఒకటి కలుసుకొని పోవును. ఈ దశలోకూడా దురద యుండును. మంటలు, పోట్లు, ఉండవు. రాత్రిలందు నిద్రియూ పట్టును. పగటిపూట బాగుగా నిద్రపట్టును. పాదములు లావెక్కును. ఈదశలోకూడా చికిత్సలు చేయుటకు వీలుగా ఉండదు. పొత్తికడుపుమీద మట్టిపట్టీ

వేయుట, పొక్కులపైన తరుచుగా నూనె రాయుట, అగరు మొదలగు వానితో ధూపము వేయుట యీ దశలో చికిత్సలుగా నుండును. ఈ దశలో వేపయిగురు నూరి, నువ్వులనూనెతో కలిపి, దేహమునకు రాయుచుండవలయును. ప్రతిదినము వేడినీటితో సీకాయి, కుంకుడు మొదలగువాని నురుగుతోను స్నానము చేయుచుండవలయును.

వాడ నారంభించి నప్పటినుండియు ప్రాణాపాయము తప్పిపోయినట్లే గ్రహింపవలయును. పథ్యములో చీమును కలిగించు పదార్థములు అనగా పాలు, పెరుగు, పప్పుపదార్థములు పెట్టక కేవలము పండ్లనే పెట్టవలయును. పండ్లను సంపాదించుకోలేనివారు మూడు రెట్లు కూరను అన్నముతో కలిపి తినవలయును. ఈ దశలో కొన్ని పొక్కులు చితికి పుండ్లగును. ఆ పుండ్లను పొడి పదార్థముతో కప్పవలసి ఉండును. నన్నికెలులో వేసి మెత్తగా నూరినబియ్యపుపిండినిగాని, రోగములేని ఆవుల పేడతో తయారుచేసిన బూడిదనుగాని యిందుకు ఉపయోగించవచ్చును.

ఈ దశలో యీగలు వాలకుండా శ్రద్ధ తీసికొని రోగిని కాపాడుచుండవలెను. రోగి కూడా పొక్కులను గోకి పుండు చేసుకోకుండా చూడవలయును. ఎందువలవనగా సహజముగా ఎండిపోయిన పక్కులు నాలుగు, అయిదు రోజులలో రాలిపోవును. బలవంతముగా బాధ చేసిన పుండ్లు మెన్నో రోజుల దాకా మానవు.

## అరవదగు ఎండుదశ

వాడిపోయిన పొక్కులన్నియు ఎండిపోవును. చమత్కార మేమనగా ఈ దశలో చితచిత లాడు చుండు పొక్కులన్నియు శీఘ్రముగను, సంపూర్ణముగను యెండిపోవును. మలబద్ధక మున్నయెడల ప్రతిదినము ఉదయము పూట మూడు పైంట్ల నీటితో రెండు తూరులు ఎనిమా చేయవలెను. ప్రతిదినము తేలికగా భరించుటకు వీలైన గోరువెచ్చని నీటితో స్నానము చేయించు చుండవల యును. స్నానమునకు ముందర ఒడలంతయు మంచి నువ్వులనూనె రాచి కుంకుడు, సీకాయి మొదలగు వాని నురుగుతో తోమ వలయును. ఇట్లు చేసినవుడు ప్రతి

దినము పక్కులు రాలిపోవుచుండును. ఈ దశలో ఆకలి యెక్కువగానుండును. అయి నప్పటికీ చీమును కలిగించే పప్పు, పెరుగు, పాలు మొదలగు పదార్థములను రోగికి ఆహా రముగా నీయరాదు. రసముగల పండ్లతో సాధారణముగా ఆకలి తీరదు గనుక గట్టివగు అరటిపండ్లు, సపోటా మొదలగుపండ్లను కూడా ఆహారముగా యీయవలసియుండును. పేదలుగా ఉండేవారు పండ్లను సంపాదించుకో లేరుగనుక, అన్నమునకుమూడు రెట్లుగా ఉండు కూరతో దినమునకు ఒకటి రెండుతూరులు ఆకలి ననుసరించి ఆహారమును యీయవలెను.

## ఏడవదగు నిర్మాణదశ

దేహమునందలి మాలిన్యము లన్నియు క్షాళ నము పొంది ఉండును. గనుకను ఆకలి బాగా జ్వలించి ఉండును. గనుకను ప్రత్యేకచికిత్స లతో నిమిత్తము లేకుండనే మశూచిక రోగికి వేగముగా బలము చేకూరును. దేహము బాగా సున్నితముగా నుండును. గనుక, త్వరగా బలము వచ్చుటకు ఆశపడి గట్టిపదార్థములు పెట్టితే అపకారము సంభవించును. అంతే

వలన తేలికగా జీర్ణముకాదగిన రసవంతము లగు ఆహారములనే యీయ వలెను. ఆకలి యెక్కువైన యెడల బిడ్డలకు రెండవ తూరి కూడా ఆహారము నీయవచ్చును. ఆకలి ఉన్నా, లేకపోయినా కూడా యీ వ్రాతలు చూచి యెవరును రోగికి నిర్బంధముగా గాని ఔదార్యముగా గాని భోజనము పెట్ట రాదని గుర్తుపెట్టుకో వలెను.

## మశూచికములో వచ్చు రక్తాభిష్యందము

మూడు, నాలుగు దశలలో మశూచిక రోగు లలో కొందరకు మలమూత్రముల వెంటను, కన్నులనుండియు, ముక్కులనుండియు, నోటి రక్తమువచ్చుట కలదు. కొందరు రోగులకు నుండియు, మశూచికపు పొక్కులనుండియు రక్తము స్రవించుచుండును. ఇది చాలా కష్ట సాధ్యమైనలక్షణమేను. అయినప్పటికిమన వైద్య ములో దానికిని చికిత్సగలదు. రోగికి కొబ్బరి నీటిని త్రాగించుచుండిన యెడల యీరక్తా భిష్యందము అరికట్టవచ్చును. నీలిసీసాలో పోసి 10 గంటలు యెండబెట్టిన నీటిని చల్లా రిన తరువాత గంటకు పావు గొన్నుచొప్పున

యిచ్చుచుండిన యెడల రక్తాభిష్యందము నయమగును. అంతే కాకుండా యే అవయవములలో నుంచి రక్తము వచ్చుచున్నదో ఆ అవయవమును నీలిసీసా నీటితో తడుపు చుండుట వలన కూడా రక్తాభివ్యందము నయమగును. ఏ పొక్కులలో నుండి రక్తము కారుచున్నదో ఆ పొక్కులను నీలిసీసా నీటితో తడిపిన తడిపొత్తితో కప్పుటవలన కూడా రక్తస్రావము తగ్గును.

### గొంతులో గురగురగా నుండుట

గొంతులో కొందరు రోగులకు నాలుగు, అయిదు, దశలలో గురగుర కానిపించును. వేడినీటితో కావడము పెట్టుటగాని, ఎర్రసీసా నీటిలో తడిపిన గుడ్డను నాలుగు మడతలు వేసి కంఠమునకు చుట్టు చుండుటవలన గాని యిది నయమగును. గొంతులో గురకగా నున్నప్పుడు రోగికి అన్నముగాని, పాలుగాని, పప్పుగాని పెట్టక కేవలము పండ్లరసమునే యిచ్చుట మంచిది.

### న్యూమోనియా కలిగినపుడు

దినమునకు ఒకటి, రెండు కంబళి చుట్టలను

శబంధమువరకే వేయవలయును. మంచి నీరు తప్ప యెట్టి ఆహారమును ఈయరాదు. గంటకు పావుఔన్సు చొప్పున ఎర్రసీసాలోని నీటిని లోనికి యిచ్చుచుండవలెను.

## మూత్రబంధమునకు

కొబ్బరి నీటిని తరుచుగా త్రాగించుటవలన మూత్రబంధము నయమగును. నీలిసీసాలోని నీటిని గంటకు పావుఔన్సు చొప్పున లోనికి యిచ్చుచుండుట వలనను మూత్రబంధము తగ్గిపోవును. బార్లగింజలువేసి కాచిన నీటిని అప్పుడప్పుడు త్రాగించుచుండుట వలనను మూత్రబంధము తగ్గును.

## మశూచిక రోగికి చేయవలసిన సామాన్య ఉపచారములు

1. గాలి సౌమ్యముగా వీచునట్టి, వెలుతురు వచ్చునట్టియు గదియందు మశూచిక రోగిని ప్రవేశపెట్ట వలయును.

2. ప్రతిదినమును రోగియుండు గదిని పరిశుద్ధమగు నీటిచే బాగుగా గోమయముతో అలక వలయును. ముగ్గులు పెట్టవలయును.

3. గదిలోనికి దుర్గంధము రాకుండునట్లు శ్రద్ధ తీసికొనవలెను.

4. దినమునకు రెండు మూడు తూరులు అగరుతోగాని, మంచిగంధముతోగాని, సాంబ్రాణితోగాని, గదిలో ధూపము వేయవలెను. ప్రతిదినము ఉదయము, సాయంకాలముల యందు రోగియొక్క మనస్సు శుద్ధిగా నుండ గలందులకు భగవత్ప్రార్థన చేయించవలెను.

5. ప్రతిదినము రోగి పరున్న వస్త్రముల నన్నిటిని చవుడు సున్నములోగాని, సబ్బుతోగాని బాగుగా ఉతికి ఎండవేయవలెను.

6. మురికిగా నున్నట్టిగాని, రోగి భరింపలేనంత కరుకుగా నున్నట్టిగాని వస్త్రములను రోగికి ప్రక్కన వేయరాదు.

7. మూడు, నాలుగు, అయిదు దశలలో రోగి మెత్తని ప్రక్కను కోరును గనుక అనేక మడతలువేసి మెత్తని గుడ్డను ప్రక్కకు వేయవలెను. రోగి ప్రక్కమీద లేత వేపమండలను ఉంచవలెను.

8. అవసరమైనప్పుడెల్ల వేపమండలతోనే రోగికి విసరుచుండవలయును.

9. రోగికి వెలుతురును చూప జాల నప్పుడు కిటికీలకు పలుచని గుడ్డను అడ్డము కట్టవలయును.

10. గాలి విసురుగా వచ్చుచున్న యెడల రోగి ఆ విసురును భరింపలేనుగాన గాలి వచ్చువైపున కిటికీకి పలుచని గుడ్డను అడ్డము కట్టవలయును.

11. ఎప్పటి కప్పుడు మలమూత్రముల పట్టి శ్రద్ధగా గోతులో కప్పివేయవలయును.

12. రోగిని ప్రతిదినము ఒక తూర్యైనను సుఖముగా ఉండు ఉష్ణముగల నీటితో స్నానము చేయించవలెను. స్నానము చేయించుటకు రోగికి అనుకూలముగా లేనియెడల కాళ్ళు, చేతులు, కబంధము, వేరు వేరుగా కడిగి వెంటనే కడగవలయును.

13. కుండలో పోసిన చన్నీటిని జాగ్రత్త పెట్టుకొని కోరినప్పుడెల్ల త్రాగుటకు ఆ నీటిని రోగికి యిచ్చుచుండవలయును.

14. కలితలేని నువ్వులనూనెను జాగ్రత్త పెట్టుకొని అవసరమైనప్పుడెల్ల రోగి దేహమునకు ఆ నూనెను రాయుచుండవలయును.

15. రోగికి నిరుత్సాహము కలిగే మాటలు చెప్పుటగాని, అతనికి యెదురుగా కూర్చుని యేడ్చుటగాని పనికిరాదు.

16. ధైర్యమును కలిగించేమాటలను చెప్పుచు రోగి చికిత్సకు సుముఖముగా నుండునట్లు చూడవలయును.

17. రోగిదగ్గరనుండు ఉపచారకులు, రోగి యెంత విసిగించినను ఔదార్యముతోను, సహనముతోను రోగికి ఉపచారము చేయుచుండవలయునేగాని రోగి విసిగినప్పుడెల్ల కేకలు పెట్టి కోపగించుకొనేవారుగా ఉండరాదు. ఎందువల్లననగా రోగికి సహజముగానే యెంతో చిరాకు, బాధ, ఉద్రేకము, ఉండును. దానిని రెచ్చగొట్టిన యెడల రోగికి ప్రలాపాదులు యెక్కువగును.

18. ఈ నియమముల నన్నిటిని సక్రమముగా పరిపాలించిన యెడల రోగికి యెంతో మనశ్శాంతిగా నుండుటయేగాక రోగము నిశ్చయముగా నయమగును.




---

# వి ష య సూ చి క

---